తే॥ తామసుల కెల్ల మసిఁ బూయఁ ♦ దవిలి కొలుచు
వారి ధన్యులఁ బొనరింప ♦ వచ్చినాడ
వడిగికొను దాసునకె భిక్ష ♦ యనెడు నుడికి
నొందు గతి గల్గునే తండ్రి! ♦ యొక్కనాఁడు. ౧౦౪

తే॥ ఓం టెఱుఁగు నిట్టి తత్త్వ మ ♦ న్యందు గానఁ
డిట్టి స్ఫురణ నిలుచుఁగాత ♦ మెల్లతఱిని
దర్శన మొనర్చితి నలభ్య ♦ దర్శనము ని
దర్శనము సద్గతికి నీప ♦ దద్వయమ్ము. ౧౦౫

తే॥ ధనకళత్రాదివాంఛలఁ ♦ దవిలి నరుఁడు
దర్పమున ని న్నెకించనుఁ ♦ దలఁపఁబోఁడు
నీదు కైంకర్య మొనరించు ♦ నెఱిఁ దనర్చి
యభయుఁ డై సజ్జనుఁడు ము క్తి ♦ నందఁగాంచు. ౧౦౬

వ॥ నీవు నిష్కించనధనుండవు నివృత్తగుణమార్గుండవు నిర్గుణుండవు గుణాత్మకుఁడవు స్వాత్మాభిరాముఁడవు కాలస్వరూపుఁడ వధీశానుండ వాదిమధ్యాంతవర్జితుండవు సర్వ భూతాంతరవస్థితుండవు నగు పరమపురుషుండ వని యనారతంబును నాడెం దంబునం దలంచి వందనంబులు సమర్పించుచుండుదు. ౧౦౭

ఆ॥ దేవ! నీదు లీలఁ♦దెలియ నేర రసత్తు, స్వం బనంగ నగు వి♦డంబనంబు
విహితుఁ డొండు లేఁడు♦విద్వేష్యుఁడన్యుండుఁ, గాఁడు తలఁతు రిన్ని♦గతులమతులు.

చ॥ అజుఁడ వకర్త వీశుఁడ వ ♦ నాది వనంతుఁడ వైన నీవు ము
న్నజుని సృజించి తన్న నది ♦ యంత విచిత్రముగాదు తిర్యగా
దిజనులఁ దేజరిల్లుటయు ♦ తెప్పర మన్నది కాక నన్నుఁబో
టి జనముఁ దేల్పఁ జొ ప్పిటు గ ♦ డించి మెలంగుట చోద్య మచ్యుతా! ౧౦౯

ఉ॥ కొందఱు కోసలేశ్వరుని ♦ కోర్కికిఁ దత్సతి నోము పంట వై
తందురు చెట్టరక్కసుల ♦ యాగడము ల్తెరలింప నైతి వి
ట్లందురు కొంద ఱందు ఘను ♦ లందురు సచ్చరితాప్తి కంచు నే
మందఁగరాని మేలి ఫల ♦ మందితి మెట్టులయేని శ్రీపతీ! ౧౧౦

ఆ॥ ఎవ్వ రిట్టి కథల ♦ నెంచి పఠించి సం, కీర్తనం బొనర్చి ♦ న ర్తనంబు
సలుపువారొ వారు ♦ సంభవార్ణవ మీఁది, నీదు పదముఁ గాంచి♦నెగడువారు.

తే॥ అభవ ! మాయాతిగుఁడవు జ్ఞా ♦ నాదిలక్ష
ణాశ్రయుండ వవిషయుండ ♦ వైన నిన్న
నంతమాయాగుణనిబద్ధ ♦ నబల నెట్లు
గాంతు వినుతింతు నీకృప ♦ కలిమిఁ గాక. ౧౧౨

క॥ వానరరాజును దమ్ముఁడు, నీనేమం బరసి కొలువ ♦ నేఁటికి నాపై
నూనిన దయ వివరింపఁగ, రా నెంచితె సద్గుణాభి ♦ రామా! రామా! ౧౧౩

ఆ॥ అని నుతింప రాముఁ ♦ డలరి యమ్మరో మది
నున్న కోర్కిఁ దెలుపు ♦ మొసఁగువాఁడ
నేవరంబ యేని ♦ నెడపక యన నామె
యనెఁ గృతార్థ యగుచు ♦ నలరుఁబోఁడి! ౧౧౪

—♦ స్వయంప్రభ ప్రత్యక్షమయిన రాముని వరము లర్థించుట ♦—

ఆ॥ ధన్య నైతి నీవు ♦ దర్శనం బిడి నంత, వరము లిత్తు నంటి♦వాంఛ దీఱఁ
గోరు దాన నింకఁ♦గుంఠితఁ గా నేల, శ్రేయమునను దృప్తిఁ ♦ జెందనగునె.

సీ॥ భక్తవత్సల! నీదు ♦ పాదారవిందమ్ము, లెల్లవేళల భజి ♦ యించుచుండ
నొడ్లజోలి యొకింత♦యును లేక త్వద్భక్తు, లున్నచోటున నుండి♦యొలయుచుండ
నాజిహ్వ నీరామ ♦ నామమ్మునకు వశ్య, యై తదావృత్తి తీ ♦ యమున నుండ
దివ్యమంగళమూర్తి ♦ దేదీప్యమానుండ, వగు నీదు స్మృతి మతి ♦యలరుచుండఁ
జేయు మేవర మే నొల్ల ♦ సీతతోడ,
లక్ష్మణునితోడ మధురలీ ♦ లాయిత యగు
గతిని శరచాపభూషణ ♦ కలన లొప్పఁ
దోఁచు నినుఁ జూచు విధి కన్న ♦ సుగతి కలదె. ౧౧౫

ఆ॥ అనుచుఁ గలికిమిన్న♦యానందబాష్పము, ల్దొనుక వేఁడుచున్నఁ♦గని కరంబు
గనికరంబు దనరఁ♦గల్యాణమూర్తిశ్రీ, రాముఁ డిట్టు లనె న♦రాళచికుర. ౧౧౬

—♦ స్వయంప్రభను శ్రీరాముఁడు బదరీవనమున కేగు మని నియమించుట. ♦—

క॥ అది యట్టులె యగుఁగాపుత, బదరీవనమునకుఁ జనుము♦పావని! నను నె
మ్మదిఁ దలప దలఁపు మీఱ వను, పదమే మత్పదము సేరఁ♦బాల్పడుదు వనఘా,

ఆ॥ అమృతసారకల్ప ♦ మైన యవ్వాక్యమ్ము, వీను లలరుచుండ♦విని తదంఘ్రి
కమలములకు మ్రొక్కి♦కల్యాణి తత్తీర్థ, మెనసి ముక్తిఁ గాంచె♦నిందువదన!

ఉ॥ అచ్చట వానరోత్తము ల ♦ హర్పతిరశ్మిఁ జొరంగనీని శై
లోచ్ఛ్రయకాననాంతమున ♦ నొక్క మహీరుహషండ మందుఁ దా
రొచ్చెము లేని మంతనము ♦ నొయ్యనఁ గూడఁగఁ గూర్చి కర్జపు
న్మచ్చట లాడఁ జొచ్చి రిటు ♦ మోహితు లై ధరణీధరాత్మజా! ౧౨౦

కం॥ శ్రమ మధిక మగుటఁ గార్య, క్రమ మొండెడఁ దోఁపకుంట♦గడువు చనుట దు
ర్దముఁ డినజునిచే నింకిటఁ, దమ కెద్దియొ మూఁడు ననుచుఁ♦దలఁచుచు నుండన్.

ఉ॥ అంగదదుర్మనస్కుఁ డయి ♦ యంగదుఁ డందఱఁ గాంచి యిట్టు లే
గం గని త్రొల్త నన్నడఁచుఁ ♦ గా దన కర్కజుఁ డట్టి దుష్టు శి
క్షం గని నీల్గ నేమి యగుఁ ♦ గల్గదె చా వొకమంచిపద్ధతిన్
సంగతి మీఱ నేవిధినిఁ ♦ జర్చ పొనర్చెద రొక్కొ నేరమిన్. ౧౨౨

ఆ॥ ఇన్ని నాళ్లుఁ దిరిగి♦యేని జానకిఁ గాన, మెల్ల తఱియుఁ గడచె♦నింతవట్టు
గమ్యపదముఁ జేర♦కయ యిట్టు లలసితి, మెఱఁగి చనిన బ్రదుకు♦నిరవు గలదె.

ఆ॥ చెప్పినన్ని చోట్లుఁ ♦ జెనసి యారయ కొంట
నొక్క కడనె నెమకి ♦ యులికిపడుచుఁ
జనిన మనల రాజ ♦ శాసనాతిక్రమ
దోష మెంచి విడఁడు ♦ దుష్టుఁ డతఁడు. ౧౨౪

కం॥ నను మహనీయుఁడు రాముఁడె, మనిచెను గాకినసుతుండు♦మన్నించె నె యే
మని చేరఁబోదు నిపుడీ, పని యిట్లు సెడంగ నతని♦ప్రాపుఁ దలంగన్. ౧౨౫

ఆ॥ మున్నె శత్రుఁ డిపుడు♦మోహవశంవదుఁ, డన్న భార్యఁ గొన్న♦యధముఁ డింక
నేల నన్నుఁ బ్రోచు♦నే నందు రాఁజాల, నిందె యుందుఁ జత్తు♦నెట్టు లయిన.

కం॥ అని యశ్రుమోక్ష మొనరిం, చినఁ దారుఁడు మున్నుగా స♦చివులు వ్యథితు లై
యని రిట్లని నీ విమ్మెయి, ననవచ్చునె యనద పోల్కి♦హరినాథ సుతా! ౧౨౭

ఆ॥ వీరు నిన్ను మనుచు♦వార మే మనుటకు, సిగ్గుపడెద మింత♦చెట్ట యేల
యెంత లైనఁ జాల♦మే నివసింత మీ, కందరమునయందు♦ఘనత మెఱయ.

తే॥ సకలసౌభాగ్యములకుఁ దా ♦ నకమకాఁగ
నీపురము స్వర్గపురమున ♦ కెన యనంగఁ
జాలియున్నది కిష్కింధ ♦ జోలి యేల
జాలిపడ నేల యింతకుఁ ♦ జావ నేల. ౧౨౯

కం॥ కన్నెత్తి చూడఁగలఁడే, యెన్నండేనియు హితుం డ♦హితుఁడును నొక్కం
డున్నను నియ్యది దుర్గం, బన్నదిమాత్రమె స్వరాజ్య♦మనఁగా వలదే. ౧౩౦

— హనుమంతుఁడు వగచు కపుల కుపాయముఁ జెప్పుచు నంగదుని బుద్ధి ద్రిప్ప బూనుట —

తే॥ అనుచు బుడిబుడినుడులతో నతనిఁ గదిసి, యల్లనల్లన గడిదేర్చి యధిపు కృతినిఁ
గొఱుమాలి నొనరింపంగఁ దలఁచువారి, యంతర మెఱింగి సాధుల యగ్రణి యుండు.

క॥ హనుమఁడు తనలోఁ దా ని, ట్లనుకొనె నష్టాంగధీస మన్వితుఁడు బలం
బునఁ దండ్రిఁబోలుఁ బ్రిణిఘులు, ననువుపడిరి వీఁ డొకంట నలఁతిం జనునే.

తే॥ వర్ధమానుం డగుచు నున్న వాఁ డితండు, శుక్లపక్షశశిం బోలె శుభసమృద్ధిఁ
గోరుచున్నాడు పినతండ్రి గొడవ మఱచి, తారపక్షాశ్రయణమునఁ దవిలి యిపుడు.

క॥ మూఁడవ యుపాయమున నో, రాడకయుండంగ వీరి నలయించి యటఁ
వేఁడఁగ నలరించెద నిఁక, వేడబ మని మిన్నకున్న విధి సెడకున్నే. ౧౩౭

క॥ అని భర్త్రర్థపరిశ్రాం, తుని శాస్త్రవిదగ్రగణ్యు ధుర్యుఁ గుమారేం
ద్రునిఁ గని వాఁ డిటులనెఁ దన, వినయము నెఱజాణతనము వెల్లడి గాఁగన్.

ఆ॥ ఈవు తండ్రి గిట్టి యెడసి యొక్కటి ధురం, బవధరించి యెంత లైనఁ జేయఁ
జాలువాఁడ వైన సరణియే యిది నిన్నుఁ, బోటి కగచరేంద్ర పుత్ర! యిపుడు.

క॥ స్వామిద్రోహము కాదె, రామేంద్రుని కర్జ మరసి రా మేకొని యి
ట్లే మరుదెంచితి మని కొన, కే మంతన మెనసి దాని నెడయింపంగన్. ౧౩౮

తే॥ నీ కతఁడు మేలు గూర్చున న్నెఱియుఁ దండ్రి
యెలమి నైఁ గనుచున్న య య్యుచ్చకంబుఁ
జెదర నీ విట్లు కెడసినఁ జెడవె యిహముఁ
బరము నిమ్మెయి నగు మేలి పట్టుసడల. ౧౩౯

ఆ॥ కూడియుండు రెట్లు క్రోఁతు లస్థిరచిత్తు, లెగయు మనుచుఁ జేతు లెత్తి విడుతు
రవల నీదు గతికి నవ్వ్యోడువాఁ డొండు, గలఁడె యింత దలఁప వలదె మదిని.

ఉ॥ ఉన్నటు లుండి దారతను జోన్ముఖు లై నెప మెన్ని వీర లే
గ న్నెఱిమాలి నీ వనద గా నయితేనియుఁ దీఱితేనియున్
గన్న ఫలం బదేమి జని గాంచిన నీవునుఁ గన్నవాను సం
పన్నత వీడి దూఱెనయు మాత్రకె యిట్టి యశఃప్రతాపముల్. ౧౪౦

సీ॥ నీ కోడి దగు లోక మే తమ కని యిందుఁ బెద్ద లేతెంతురే పెనుపు దక్కి
ననుఁబోఁటివారలు నాయం బెడలి యింత, గాఁ బాపకర్మంబుఁ గట్టికొనరు
బలవంతుఁ డెందు దుర్బలునితో విగ్రహ, మాసనంబు నొనర్ప నగు నటందు
రిందుఁ డొక్కించుక యోఁ జెక్కెఁ గొండల, సౌమిత్రి చూర్ణింపఁ జాలియుండుఁ

దలఁగి చననీయ వమ్మహా ♦ త్ముల శరములు
గంధరమె కాదు బ్రహ్మాండ ♦ కర్పరంబు
నేని భేదించు ని ట్లింత ♦ యెఱిఁగి యెఱిఁగి
యేల చెడిపోవ నానుడి ♦ యెల్ల వినుము. ౧౪౧

క॥ ఒక్కింత తడసియేనియుఁ, జక్కఁగఁ గర్జంబు నెఱపి ♦ సడిసన్నలఁ బెం
పెక్కుడుగ నరసి యేగిన, నెక్కరణిని హింస సేయు ♦ నినజుం డొడ్లన్. ౧౪౨

ఆ॥ ఏము నీవు నొక్కఁ డే ♦ యయి కృత్యమ్ము
నెఱపి సాధుమార్గ ♦ నియతి వెలయఁ
జనిన నిన్ను మెచ్చు ♦ సామ్రాజ్య మేలించు
ననుచు కూర్మిఁ దపన ♦ నందనుండు. ౧౪౩

ఆ॥ లేఁడు బిడ్డఁ డొండు ♦ కాఁ డధార్మికుఁ డతం
డేల నిన్నుఁ జంపు ♦ నింతమాత్ర
కర్థ మనఁగఁ బ్రాణ ♦ మనఁగ మీ రని కాక
యన్య మెంచఁ డిప్పు ♦ డర్కసుతుఁడు. ౧౪౪

క॥ కావున నీతలఁ పొప్పదు, భావింపుము రామ కార్య♦పద్ధతి యింకన్
సేవింపు మమ్మహాత్ముని, జీవింపుము తత్కృపాప్తిఁ♦జిర కాలమ్మున్. ౧౪౫

క॥ అన నంగదుఁ డిట్లనియెను, దనమనమునఁ దాల్మి లేమిఁ♦దహాతహాపడుచున్
మునుకొని తన కాతఁడు దెలి, పిన యవి యస్థైర్యవృత్తిఁ♦బెడచెవిఁ బెరయన్.

—♦ అంగదుఁడు హనుమద్బోధితుఁడయ్యుఁ బ్రాయోపవేశమునకు సమకట్టుట. ♦—

సీ॥ స్వామిహితార్థంబు♦సత్కారయుక్తంబు, నౌ యుక్తిఁ బలికెద♦వాంజనేయ!
స్థైర్య మార్జవ మాన్య♦శంస్యంబు పౌరుషం, బను నివి సుగ్రీవు♦నందు లేవు
శత్రుతో గుహ సొచ్చి♦చన్న యన్నను వీడి, శిల లాఁగఁ బూడ్చిన♦ఖలుఁ డతండు
కన్నతల్లినిఁ బోల్పఁ♦గాఁ దగియున్న త, త్పత్నిఁ జేకొనియున్న♦పాపి మఱియు
రాము మఱచెను లక్ష్మణో ♦ ద్దామకోప
మరసి భయమునఁ దోలెఁ దా ♦ నగచరులను
నెల్ల దెసలకు ని ట్లింత ♦ యెఱుకఁ గాంచి
వైరితనుజుండ నగు నాకుఁ ♦ జేరనగునె. ౧౪౭

ఆ॥ భిన్నమంత్రుఁడను బ్ర♦వీణుండఁ గా నప, రాద్ధుఁ డను నొకంట♦రాదు మాచి
శక్తి లేమి నేప్రి ♦ సంగంబునకుఁ జాల, నెట్లు గూర్చువాఁడ ♦ నినజునకును.

క॥ శాసన మను మిష యిడి దు, శ్శాసనుఁ డాతండు దన్ను ♦ శాసించున కా
కేసడికి వెఱవఁబోవఁడు, హాసి యునికి తక్క లేదు ♦ పద్ధతి యింకన్. ౧౪౯

ఆ॥ ఇన్ని యేల యుసురు ♦ లెడలింతుఁ బ్రాయోప
వేశనమున నన్ను ♦ విడువుఁ డింక
నదియ మేలు తనకు ♦ నన్యాయ్యమౌ శిక్ష
వలని చావు ధప్పు ♦ వలను గలుగ. ౧౫౦

ఆ॥ నన్నుఁ బేర్మిఁ గన్న ♦ నాతల్లికిం జెప్పుఁ
డధిపునకు వచింపుఁ ♦ డడిగితి నని
యెట్టిఁ డైనఁ దండ్రి ♦ యే యాతనికి నింత
వినుచుఁ డిట్లు మిమ్ము ♦ వేఁడె ననుచు. ౧౫౧

తే॥ ఆమె ప్రియపుత్రి తన కైన ♦ యనుఁగుఁబిడ్డఁ
డిట్లుగా నే మనునొ మీఁద ♦ నెట్లుమనునొ
యూఱడింపుఁడు మీ రెల్ల ♦ యుక్తి మీఱఁ
దార మును రాజ్ఞి యనెడు నే ♦ స్తమ్ము గూర. ౧౫౨

క॥ అని పలికిన పలుకులతోఁ, గనుకొలుకుల వేఁడినీరు ♦ గ్రమ్మఁగ నమ్మెఁ
దన వగరు దక్క వగ పెను, పునఁ జిక్కిన పిన్నదొరఁ గ ♦ పుల్గని తోడ్తోన్.

—♦ అంగదుని తెంపునకు కపులు వగచుచుండ మఱల హనుమ రామతత్త్వము బోధించుట. ♦—

ఆ॥ వాలిఁ బొగడువారు ♦ వనజాప్తసుతుఁ దిట్టు, వారు వానితోడి ♦ వర్తనంబె
తమకు ననెడువా ర ♦ తనిఁ జుట్టి వయ మేది, నిలిచి రెల్లవారు ♦ నీరజాక్షి! ౧౫౪

ఆ॥ కాంచి కర్జ మింక ♦ గతి దప్పు నని యెంచి, నీతికోవిదుం డ ♦ నిలసుతుండు
జాంబవత్ప్రముఖుల ♦ సద్విచారులఁ గూర్చి, కొని కుమారవీరుఁ ♦ గుర్చి చ్చి యెత్తి

క॥ బోధించె నీతు లొగిఁద, త్సాధుత్వము వెలయఁ దలఁకు ♦ దలఁగక యున్నన్
శ్రీరాముఁ దలఁచికొనుచు న, దాధారుం డాతఁ డిట్టు ♦ లనెఁ బ్రాణసఖీ! ౧౫౬

ఆ॥ వినుము వత్స! నీకు ♦ వినిచెద నొక్క ర
హస్య మైన తత్త్వ ♦ మవధరించి
తేని నెట్టి యిడుమ ♦ లెనయంగ నైన జ
యింతు మోహావృత్తి ♦ యెడము పడఁగ ౧౫౭

క॥ ఈరామవిభుఁడు సాక్షా, న్నారాయణుఁ డవ్యయుండు ♦ నరమాత్రుఁడు గాఁ
డారామ జగన్మోహిని, శ్రీరమ విదూర విబుధ ♦ సేవ్య కుమారా! ౧౫౮

తే॥ ఎంచు మెద లక్ష్మణుండు ఫ ♦ ణీశ్వరుండు
పావనుండు భువన భార ♦ భరణదక్షుఁ
డవ్విరించనుఁ డర్ధింప ♦ నందినారు
వారు మాయామనుష్యభా ♦ వమున భవము. ౧౫౯

ఆ॥ అల వికుంఠపురము ♦ నంద యుంచుము ముందు
వచ్చినార మిట్లు ♦ వసుధ కిపుడు
పెద్ద నోము ఫలము ♦ పెనుపున లోకర
క్షణముపొంటె విభునిఁ ♦ గదిసి కొలువ. ౧౬౦

క॥ పారిషదుల మియ్యనువునఁ, భారిప్లవభావమునకుఁ♦బట్టుపడఁగ నే
లా రిపుమర్దనకృతిఁ గను, లారం గని మేల్మిఁ గాంచ♦నయ్యెద మనఘా! ౧౬౧

ఆ॥ అన్య మెంచఁబోకు ♦ మరసి యారాధింపు
మమ్మహాత్ము శుభము ♦ లందఁ గాంతు
వనుచు నూఱడించి ♦ యుందఱఁ గొని చనె
వాఁడు వింధ్యనగము ♦ వదలి సుదతి! ౧౬౨

ఉ॥ అంబుధితీరముం జేరసి ♦ రంబుజలోచన! వారు పోవు త్రో
వం బలుచోటు లారయుచు ♦ భావిని నాఁతుముఁ గాంచు మేలి భా
గ్యం బెపు డబ్బునో యనుచు ♦ నల్లన మెట్టుచు నమ్మహేంద్రశై
లంబున నైన గండశిల ♦ లం బఱపై యొఱపైన యద్దెసన్. ౧౬౩

ఆ॥ బడలియున్న వారి♦పాలికి సంసార, మట్లు భార మగుచు♦నంబునిధియుఁ
దోఁపఁ బారలబ్ధి♦దుర్లభ యను చింత, మఱల మోహసింధు♦మగ్నులైరి. ౧౬౪

క॥ అంగదునిఁ దొట్టి కపు లవు, డంగములఁ గుశాస్తరణల♦నటు వైచిరి దా
రిం గనసీతని యమ్మెయి, సంగతి కి న్మెలి ధృతి ప్ర♦సంగము గలదే. ౧౬౫

—♦ కపివీరులు సముద్రముం గాంచి విచారపడుట. ♦—

సీ॥ ఇది దుస్తర మగాధ♦మిద్దానిఁ గనినంతఁ, దల్లడిల్లెడు మది♦తలఁకుదోఁప
నాగుహాంతరమున♦నన్ని నాళ్లు భ్రమింప, నకట మాసము గడు♦వందుఁ గడచెఁ
గానరా దింతకుఁ♦గల్యాణి యద్దేవి, రావణుం డట్లు దూ♦రస్థుఁ డయ్యె
నుగ్రదండుఁడు కద♦యుష్ణాంశతనుజుండు, తప్పక శిక్షించుఁ♦దారసిల్లఁ
జేయునదియును లేకుంట♦సిద్ధకృతిగ, నెంచి ప్రాయోపవేశంబు♦నీప్సితప్ర
సక్తిఁ బొనరించి ఘనకీర్తి♦మనుట లడంచి, యందువారల ముత్తమ♦మైన గతిని.

తే॥ అనుచు నొండొరులకుఁ దెల్పు ♦ కొనుచు నమ్మ
హాపథమ్మునఁ గృతనిశ్చ ♦ యాత్ము లగుచు
నున్నవారల నుడుల న ♦ య్యుద్యమం బె
ఱింగి తనమదిఁ గుతుకంబు ♦ తొంగలింప. ౧౬౭

ఆ॥ కొండలోయనుండి ♦ కొండొక కొండ నా
మెందుకొనుచుఁ దరలి ♦ దండిగృధ్రి
మొకఁడు వారిఁ జూచి ♦ యుత్తమాంగం బూచి
యిట్టు లనియె మదగ ♦ జేంద్రగమన! ౧౬౮

—♦ కపులు తమవంకఁజూచుచున్న సంపాతిం గని భయపడుట. ♦—

తే॥ వీరు ప్రాయోపవిష్టులై ♦ నారు విధియుఁ
దీ రరసి ప్రాణివృత్తులఁ ♦ జేరుచుండు
నట్లు గాకున్నఁ జిరకాల ♦ మనశనుండ
నైన నా కిట్టి భక్ష్యంబు ♦ లనువుపడునె ౧౬౯

క॥ ఒక్కొక్కరి మేను లెడఁగని, మెక్కుచు నుండెదను నేను♦మేకొను తృప్తి
న్మిక్కిలికాలముఁ గడపెద, నిక్కరణిఁ బ్రమోద మొదవె♦నెంత సుకృతమో.

మ॥ అని యుల్లాసము మీఱఁ దారసిల నా♦నాపక్షి వీక్షించి యొ
ప్పని యుద్దేశము నెంచి యక్కపివరు ♦ ల్వాపాత్ముఁ డీగ్రద్ధ యై
చను దెంచె న్యముఁ డిందఱం బొదువ నా ♦ సల్లీల నింకేమి యం
చని ఘోషించిరి వారి ఘోషణల నా ♦ జ్యాభృత్తు ఘూర్ణిల్లఁగన్. ౧౭౧

సీ॥ అంగదుం డందఱ♦యార్తధ్వనులు విని, హనుమతో నిట్లనె♦ననఘ! మనము
రెంటికిం జెడితిమి♦రేఁదిమ్మరీని వీఁ, డంది యచ్చటివార్త♦లరసి తెలిపి
మనుజహరీంద్రుల♦మన్నన ల్వడసితి, మో సద్గతికి నైతి♦మో యొకండు
పక్షి నోటం బడి♦పాపపు యమలోక, మెనయు వారమ కాక♦యింతవట్టు

జేసినది యేమి గల దొడ ♦ ల్వాసి యైన
వాసి గల రామకార్యప్ర ♦ వర్తనమున
మొనయఁగాంచె జటాయువు ♦ మునులకేని
నమరు ననరాని ముక్తి రా ♦ మాస్పదమ్ము. ౧౭౨

ఉ॥ భూమిసుత న్హరించి ఘన ♦ పుణ్యు మహామహు గృధ్రరాజు సం
గ్రామమున న్వధించి పలు ♦ గాకి దశాననుఁ డింతసేసెఁ గా

కామనువంశ్యు లొ ల్వమర ♦ నందరె యొందఱొ దివ్యభూతి ము
న్నేమి యొనర్చినార మొకొ ♦ యిట్టివెత ల్గనఁ జేయు పాపముల్. ౧౭౩

ఆ॥ అనుచుఁ బలుకు పలుకు ♦ లమృతంబు కొలఁకుల
విసఁపు మొలక లగుచు ♦ వేడబం బ
నంగ నైన నెవఁడొ ♦ నాసహోదరనామ
పదరసాయనంబు ♦ పంచువాఁడు. ౧౭౪

వ॥ అని యోజించుచుం దెరలి యవ్వారల నించుక గదియం జని. ౧౭౫

—♦ సంపాతి యడుగ నంగదుఁడు రామచరిత్రముఁ జెప్పుట —♦

ఆ॥ అన్నలార! తెలుపుఁ ♦ డావృత్త మంతయు, నెట్లు గంటి రతని ♦ నెవఁడు వాని
కెగ్గు సేసెఁ గడఁగి♦యెవ్వానికృతి ముక్తిఁ, గాంచె నొవ్వ మీకు♦గలుగ దింక.

క॥ అని తొ్రిటిఁ దెలిచి యఱచిన, విని యంగదుఁ డెదుర నిలిచి♦వినిచెద వినుమో
యనఘ! భవత్సోదరుకథ, మనువంశ్యాఖ్యానసుధ ని♦మగ్నత గాంచన్.

సీ॥ నీదు సైదోడుతో ♦ నేస్తమ్ము గానినాఁడు, దశరథుం డను నొక ♦ దండి తేఁ
నందను లతనికి ♦ నలువు రం దగ్రజుం, డనఘుండు శ్రీరాముఁ ♦ డధికసత్త్వుఁ
డాసర్వధని దండ ♦ కాటవిఁ జరియించెఁ, దండ్రియానతి జవ ♦ దాఁట కెలమిఁ
దనుఁ గొల్వఁగా వచ్చి♦రనుజుండు లక్ష్మణుం, డవనిసంభవ సీత♦యనెడు సతియుఁ
బొంచి యొక్కండు మెకముఁ గ ♦ ల్పించి మృగయు
లమ్మహాత్ము లరుగ సాధ్వి ♦ నపహరించెఁ
జెట్ట రావణుఁ డది గని ♦ చెలిమి నెఱయ
నడ్డపడినాఁడు నీతమ్ముఁ ♦ డమలయశుఁడు. ౧౭౮

క॥ వాలిన మగఁటిమి నాతని, చే లా వెనయంగనీక ♦ చీల్చెం దలలన్
గూలిచె నరద మరథుఁడై, సోలియు నీశ్వరవరాత్త ♦ సురుచిరశక్తిన్. ౧౭౯

ఆ॥ రక్కసుండు ధర ధ ♦ రాసుత డించి యొ, క్కండు ఖడ్గ మెత్తి ♦ ఖగవరేణ్యు
ఱెక్క లెడల వైచి♦యుక్కుమై నద్దేవిఁ, గొంచు నరిగె నామె♦ఘోషిలంగ,

చ॥ అటఁ జనుదెంచి పర్ణగృహ ♦ మందు మహీసుత లేమి నెంచి యు
త్కటభుజసారు లాఘనులు ♦ కాననభూముల సంచరించుచున్
దటుకునఁ జూచి రొక్కయెడఁ ♦ దార్క్ష్యనిభు న్విహగాధినాథు న
ప్పటిదశకుం బ్రశాంతదవ ♦ పావకుఁ డో యనఁ బొల్చు నాతనిన్. ౧౮౧

తే॥ చట్టుప ద్రెగి కూలిన ♦ శైల మట్టు
లున్న నీయను జన్మని ♦ నోజటాయు
వా! యనుచు వావిడిచి పిల్చె ♦ వరదుఁ డగుచు
రాముఁ డెంతటి కరుణాంబు ♦ రాశియొకొ. ౧౮౨

ఆ॥ తనదు తండ్రి కీఁడు ♦ దావిన్నయానాఁడు, నంత తలఁకు నొందఁ ♦ డంతరాత్మ
తనిఁ జే స్పృశించి♦యడిగె నశ్రువు లొల్కఁ, బల్లటిలుచు భక్త♦బాంధవుండు.

క॥ ఉవిహగేంద్రుఁడు చేమో, డ్వావిభున కొనర్చి చరిత ♦ మట్టె వినిచి య్యో
జీవాధారా! నాదగు, జీవిత మిఁక నిలుపనేర ♦ సెల వీవె యనన్, ౧౮౪

ఆ॥ అన్న! యోగసిద్ధు ♦ లందు నాలోకంబు, నీకుఁ గలుగుఁగాత ♦ నిరతి ననుచు
బాస సేసి యనిచి♦బ్రహ్మమేధ మొనర్చి, నతని సంస్కరించి♦యర్కకులుఁడు.

క॥ ఆదట సుగ్రీవునితో, నాదయితుఁడు సఖ్య మొనసి ♦ యతని పగతునిన్
దాఁ దునిమి వానరశ్రీ, మోదము సమకూర్చెఁ దనప్రి ♦ ముఖ్యత వెలయన్.

ఆ॥ దాని కలరి తపన ♦ తనయుండు వనుపంగ, నన్ని దెసల కరిగి ♦ రగచరేంద్రు
లేము దక్షిణమున ♦ కేతెంచినారము, చిక్కినార మొక్క ♦ చిక్కు దలఁచి.

ఉ॥ ఆకలి దప్పు లుప్పతిల ♦ నాకులపాటునఁ గందరంబు నం
బ్రాఁకిడి దైవయోగమున ♦ భాసుర మాశ్రమ మొండు గాంచి యం
దేఁకట దీఱఁ గ్రోలి తిని ♦ యిం దరుదెంచితి మిట్టిపట్టునన్
మా కిడినట్టి యాగడువు ♦ మాసము వాసె న దేమి చోద్యమో. ౧౮౮

క॥ మసలిన యాతప్పునకుం, గసిమసఁగు విభుం డటంచుఁ♦గర్జము తెలియన్
బొసఁగింపరాని దనుచు, న్విసువునఁ జేడ్పడఁగ నయ్యె♦విన్నను వెడలన్. ౧౮౯

క॥ ప్రాయోపవేశ మొనయన్, శ్రీయము గన నౌనొ యనుచు♦జింతించెద మి
ట్లీయగచాట్లు గెడప నీ, తోయము గాన్పించి తీవు♦తొలివు న్నెమునన్. ౧౯౦

ఆ॥ మాకు దారి సూపి ♦ మహిత యోజనకదు
హిత యుదంత మింత ♦ యెఱుక సేసి
చెదుఁగు రక్కసునకుఁ ♦ జేటు మూఁడు విధంబు
దెలిపితేని మమ్ముఁ ♦ దేర్తు వనఘ! ౧౯౧

క॥ ని ప్రార్థించిన నాతం, డనుజన్మని ముక్తి కలరి♦యనఘుని శ్రీరా
మునిఁ బొగడి వారిఁ గనుఁగొని, యనె నిట్లను మోదితాంత♦రాత్ముం డగుచున్.

క॥ బహువర్షశతమ్ములు చన, సహోదరుని వార్త వినఁగ♦జాలితి మీ ర
మ్మహిజాత నరయు పనికి ను, సహులై యిక్కడఁ బెరసి♦చను దేరంగన్. ౧౯౩

ఆ॥ మున్ను వాని పోక ♦ మొనయ నేరక యిట్టు
లున్న నాకు వాని ♦ చన్న తెఱవు
దెలిపినారు భాగ్య ♦ దేవత లని కాక
గూడు నెట్లు మిమ్ముఁ ♦ గ్రొఁతు లనఁగ ౧౯౪

—♦ సంపాతి కపులకు సీతజాడను దెలిపి సదుపాయముం జెప్పుట. ♦—

శా॥ మీ కే నారసినంతయుం దెలిపెద ♦ న్మీకన్న నా కెవ్వ రి
ట్లేకత్వంబునఁ గూర్చువారు నను మీ ♦ రీవార్ధిలో వైచినన్
శోకోర్మ్రుల్దెగఁ దజ్జలాంజలికృతి ♦ న్మధ్ధుండ నై వచ్చి స
త్ప్రాకట్యంబున మేలు గాంచు నెఱికిం ♦ బ్రస్థాన మూహించెదన్. ౧౯౫

ఆ॥ అనిన వల్లె యనుచు♦నవ్వార లవ్వానిఁ, బొదివి కొనుచు నబ్ధి♦పారువు నేర్ప
నతఁడు కృత్యవిధుల♦నల్లనఁ దీర్చి రా, మలయ నటుల తొంటి♦మనికిఁ గూర్చి.

క॥ ఎగిచి మెడ సాఁచి రావణు, నగరిం దిలకించి ప్లవగ♦నాథులఁ గని నా
కగపడెను మీ కెఱింగిం, పఁగ నగు నెది యదియు వగతు♦పరిభవ మెల్లన్.

తే॥ ఇచట శతయోజనాయతం ♦ బీసముద్ర
మరసి యతిలంఘన మొనర్ప ♦ నగును దొలుత
లంక నిశ్శంకఁ గని యక ♦ లంక సీత
నెఱిఁగి యీవార్త లధిపున ♦ కెఱుక సేయ. ౧౯౮

క॥ మీలో సమర్థుఁ డెవ్వఁడొ, యాలోచించుకొనుఁ డింక♦నరమఱ లేలా
చాలి కడలిఁ గడచిన నా, లోలాక్షి యశోకవనిక♦లోఁ గాన్పించున్. ౧౯౯

ఆ॥ కనులఁ గట్టినట్లు♦కనుపట్టుచున్నది, దేవి స్ఫురణ లెల్ల♦దెసల నఱుమ
దూరదర్శనంబు♦దొఱకొనుమాగృధ్ర, జాతిలోని వారి♦కేతరమున. ౨౦౦

వ॥ ధాన్యజీవు లగు కుళింగంబులు మొదలిమార్గంబునను వృక్షఫలాశులు బలిభుక్కులు
నగు కాకాదులు ద్వితీయపథంబునను భాసంబులు క్రౌంచంబులు కురంగంబు
లును దృతీయవర్త్మంబునను శ్యేనంబులు చతుర్థపదవిని గ్రిద్ధ లైదవసరణిని
బలవీర్యోపపన్నంబులు రూపయౌవనసంపన్నంబు లగు హంస లారవ నభోవీధిని
సంచరించుచుండు నన్నింటిని గడచిన సప్తమప్రస్థానంబునం బర యై యంబరం
బున వైనతేయగతి :- థవిల్లు నేను నవ్వాని వంశంబునవాఁడనైన కతంబున బల

తేజోదృగ్విశేషంబుల నసదృశుండ నై యాయసుర యునికియు నమ్మనికిన జానకీ దేవి యశోకవనికలోఁ గాన్పించుటయు నారసి యింతవట్టు మీకెఱింగించుచున్న వాఁడ గొండొక్కటి వినుం డే నొక్కకారణంబున దగ్ధపక్షుండ నై యిచ్చ టియఁ బడినవాఁడ నగుటం జేసి క్షుధార్తుండ నగు నాకు నాకొడుకు సుపార్శ్వుం డనువాఁడు నిచ్చలు నాహారంబు గొని వచ్చి యిచ్చుచుండ నిట్లుంటి గంధర్వులు తీక్ష్ణకాములు భుజంగమంబులు తీక్ష్ణకోపంబులు మృగంబులు తీక్ష్ణభయంబులు నే మత్యంతక్షుధార్తులము నై యుంట సుప్రసిద్ధంబె కదా యొక్కనాఁడు నా తనయుం డాహారంబు గొని తేరం జనినవాఁ డాతతాయి యా నయ్యసురప్రదోష ప్రారంభంబున సూర్యప్రభం బోలె నొక్క తేజోమూర్తిం గొనిపోవుచుండ నాతని కీతండు మార్గనిరోధంబు సంపాదింపఁ దలంప నన్నెఱిఁ బరస్త్రీలంపటుం డెఱింగి తన్ను యాచించి త్రోవ వడసి చనుచుండ నత్తఱి ఖేచరభూతంబులు గొన్ని యన్నెలవున నక్కుమారునిం గని నీవు సుకృతంబు కతనం బ్రదికితి వింకం బో మ్మతండు లంకేశ్వరుం డాయమ రాముదేవి జనకజాత యని నొడివిన విని యాతం డెట్టకేలకు నిరామిషుం డయ్యు నిర్దోషుం డై ననుం జేర నరుదేర వృద్ధ భావంబునకుం దోడుగ క్షుధార్తియుం దన్నుఁ గుపితునిం బొనరింప నే నగ్గుణనిధిఁ దిట్టిన నన్నుఁ బ్రార్థించి ప్రసన్నునిం జేసికొనుట కయ్యర్థం బెల్ల వినిచి భ్రష్టా భరణకాశేయయు శోకవేగపరాజితయు రామ రామా యని యాక్రోశించు నదియు నగు నాయమ నల్లదె కొంపోవుచున్నవాఁ డని తిన్నఁగ విన్నవించిన నత్తెఱి యేనునుం గనుంగొని యరాతిపైఁ గోపించియు నతిక్రాంతుం డై నిజ పురంబునం జేరంబోవు నవ్వాని నాక్రమింపం బోలమి నక్కాలం బూరకుంటి నదియునుం గాక. ౨౦౧

ఆ॥ ఱెక్క లెగువకునికి ♦ నుక్కఱి యిమ్మెయి
నైతిఁగాక తోఁడు ♦ నట్లొనర్చి
నట్టివాని రక్త ♦ మానవే తలఁ దన్ని
యింతలోన వాన ♦ రేంద్రులార! ౨౦౨

వ॥ ఏను జిరకాలవృద్ధుండ దేవాసురయుద్ధంబును ద్రివిక్రమావతరణంబును సముద్ర మథనంబును మున్నగునవి నాయెఱింగి నవియు యట్లగుటం జేసి యీనాఁటికి క్షీణ బలపరాక్రముడ నై యుంటి. ౨౦౩

తే॥ తొంటిచందంబు గా దిప్డు ♦ తోఁడు బాసి
యొంటి నైతిని రక్కసుం ♦ డుద్ధతుండు

వాని యుడుకు కార్పఁ జను నెట్టు ♦ లొనో యనుచు
నున్నవాఁడ యుష్మ చ్ఛక్తు ♦ లెన్నవాఁడ. ౨౦౪

క॥ మావృత్తం బెఱిఁగించెద, నోవిపులమనీషులార! ♦ యోపి వినుఁడు నే
నావంశవర్ధనునితో. నావినతాత్మజునివలన ♦ నందితి భవముల్. ౨౦౫

—♦ సంపాతి కపులకుఁ దనవృత్తాంతము జెప్పుట ♦—

తే॥ జనని శ్యేని నివిష్ట యా ♦ వనమదమున
ముదము పెనుపార సమ్మద ♦ మ్మొనకు మొనసి
సూర్యమండలమును ముట్టఁ ♦ జూచినార
మవలఁ దెలుపంగ నున్నదే ♦ యన్నలార! ౨౦౬

ఆ॥ ఒరసికొనుచు సుబహు ♦ యోజనసాహస్రి, మొనసి భానుఁ జేర ♦ నింతలంత
లనెడు నంతఁ దపను ♦ నా ఘాక మై సోఁకఁ, దమ్ముఁ గుఱ్ఱ వాఁడు ♦ తల్లడిల్ల.

అ॥ వానిఁ గప్పికొంటి ♦ వరపక్షములు విప్పి, భ్రాతృమోహవశత ♦ పట్టరాని
దగుట నాదుఱెక్క ♦ లవియంగఁ గాలిపోఁ, బడితి వింధ్యనగము ♦ పాదమునను.

క॥ స్మృతి వచ్చె మూఁడునాళ్లకు. మతిహీనుఁడ నైతి ననెడు ♦ మాటయె కా కే
గతి గననీ నను విభ్రమ, గతిఁ గంటిం గంటి నవలఁ ♦ గన్నులు విప్పన్. ౨౦౯

ఆ॥ చూడనైతిఁ దపమ్ము ♦ చొఱవ యొక్కింతయుఁ
జూచినాఁడ నొక్క ♦ సురుచిరాశ్ర
మంబు పున్నె మట్లు ♦ మలయుఁ గొండొక తటి
నెనయఁ గనిన ద్రొసఁగు ♦ లెల్లఁ దలఁగ. ౨౧౦

శా॥ సంపాతీ! యనిపిల్చె సద్వినుతసా ♦ జన్యానుకంపార్ద్రదృ
క్సంపాతమ్మున నన్నుఁ దేర్చుచు మహా ♦ సామ్రాజ్య మేలింపఁ ద
న్మంప న్స్వామినిలింపులే యని నిల ♦ న్మోసమ్ము లేదంచు వా
దింపం జాలినవాఁ డొకండు ముని య ♦ ర్ఘ్య న్స్వార్ఘ్య మర్థింపుచున్. ౨౧౧

ఆ॥ అర్థవతిన యాదు♦నను చంద్రమస్సంజ్ఞ, కర్హుఁ డొకఁ డితండె♦యనఁగ నెగడు
నమ్మహాత్ముఁ దపసి♦నల్లనల్లనఁ జేర, నరిగినాఁడఁ దప్పొ♦టడుఁగు లిడుచు. ౨౧౨

క॥ రవి సంతాపముఁ జందుర్రిం, డివ పుంజేతులఁ దెరల్చు ♦ టింతయు నబ్రిం
బవునె యనుమాట కమ్మని, శివంకరులు దృష్టు లట్టి ♦ సిద్ధిం గూర్చెన్. ౨౧౩

క॥ అంతటి లావరి విప్పటి, కింతలుపడి తేల వత్స! ♦ యిమ్మెసెడేఁ గదే
యెంతయు నను నాఘను నుడి, స్వాంతం బలరించె నపుడు ♦ సత్కపులారా!

ఆ॥ మొక్కి తండ్రి! నాదు ♦ మొఱకుదనం బింత
చేసె ననుచు మావి ♦ చేష్టితంబు
లెల్లఁ దెలుప మాని ♦ యిట్లనె ననుఁ జూచు
చూడ్కు లమృతఘటముఁ ♦ జూఱయిడఁగ. ౨౧౫

క॥ అన్నా! నానుడుల న్వీను, మన్నటి నీకుచిత మైన ♦ యట్లు మెలఁగు మే
మున్నది యవిచారమ్మున, నెన్నియొ యగచాట్లు గలుగు ♦ నీప్రాణులకున్.

సీ॥ దేహమూలము గాఁగఁ♦దెలియు మీదుఃఖ మ, య్యది కర్మసంభవం♦బగుచునుండుఁ
బూరుషాహంబుద్ధి♦పూర్వకం బాకర్మ, మదియు ననాద్యవి♦ద్యాకృతంబు
జడ యయ్యహంత చి♦చ్ఛాయాప్రసక్తిఁ ద, ప్తాయసపిండమ్ము♦ననుకరించి
తాదాత్మ్యమునను జే♦తనత మేని కొసంగఁ, నేనను నిన్నింటి♦ నెనసి యాత్మ

జీవుఁ డై సంస్కృతిం బడి ♦ చేయువాఁడ
ననుభవించెడువాఁడ నా ♦ కమరు సుఖము
గంటి వెత లంచు నిమ్మోయిఁ ♦ గర్మఫలము
వలనున భ్రమించును విహంగ ♦ వర్య! వింటె! ౨౧౭

—♦ జీవోత్పత్తి. ♦—

ఆ॥ ఊర్ధ్వలోకగమన♦మొందు నధోగతి, నట్లు గాంచుచుండు♦ననవరతము
వివిధవిధుల పైనిఁదవులున మెలఁగుట, నవియు భుక్తి క్షైణ్య♦మందుచుంట. ౨౧౮

ఉ॥ ఆ నెఱిఁ గర్మచోదితుఁడ ♦ యై శశిమండలి వ్రాలి మంచునన్
జా నగు వ్రీహిముఖ్య ఫల ♦ సంగతి నెట్టనఁ గాంచి భక్ష్యభో
జ్యానుగతాంశవృత్తి రస ♦ మై వెసఁ దత్పురుషప్రసక్తి స్త్రీ
యోనిఁ బ్రవేశ మొంది ఋతు ♦ యుక్తము రక్తముఁ జెందు నాదటన్.

తే॥ ఆజరాయువు పొదువంగ ♦ నందు నొందు
నైదుఁ బదునైదు నిరువది ♦ యైదు తిథులు
గడువఁ గలిలోరుబుద్బుదా ♦ కారరక్త
పేశికాంకురభావని ♦ వేశనముల. ౨౨౦

ఆ॥ ఒక్కమాస మరుగ♦నొదవును శీర్షమ్ము, స్కంధపృష్ఠవంశ♦కంధరోద
రమ్ము రెండు నెలలు♦రాఁ బాణిపదపార్శ్వ, జానుకటియు వరుసఁ♦గానిపించు.

ఆ॥ అంగసంధు లెల్ల♦నమరు మూఁడిఁట వ్రేళ్లు, నాలుగింటఁ గర్ణ♦నాసికాక్షి
దంతనఖరగుహ్య♦తలము లైదింట నా, రింటఁ దద్వివరము♦లొంట వెలయు.

క॥ పాయువు నాభియు నెఱులును, నేయవి యుపశిష్టము లవి♦యెల్ల జనించున్
బాయక సప్తమమాసం, బాయె ననఁగ సప్తమమున♦నభివృద్ధిపడున్. ౨౨౩

తే॥ నాభిసూత్రాల్పరంధ్రమ్ము ♦ నను ప్రమాతృ
భుక్తిసారమ్ము రాఁ దానఁ ♦ బోషితుండు
పుష్టగాత్రుఁడు చేతనా ♦ పూర్ణుఁడు నయి
యాతఁ డన్నింటఁ బెనుపొందు ♦ నపుడు వత్స! ౨౨౪

మ॥ తన జన్మాంతరకర్మము ల్స్మృతికి రాఁ ♦ దర్కించుచు న్సాదరం
బనలం బెంతయుఁ దాపము న్గలుగఁజే ♦ యన్వ్యగ్రుఁడై భవ్యభా
వన నిమ్మై వెలయించు దేహి వెత ద్రో ♦ వ న్నావ యై తన్నుఁ బ్రో
వ నొకం డేవగఁ దోఁచునో యనుచుఁ ద్రో ♦ వ ల్ద్రొక్కు చిత్తంబునన్.

తే॥ అకట యోనిసహస్రమ్ము♦లందు జనన, మందినాడ నిజే దెస♦ల్పొందినాడఁ
బుత్రదారాదిసంబంధి♦పోషణమతి, న్యాయ మన్యాయ మనియు లే♦కడరినాడ.

క॥ ఏను ధనార్జనతృష్ణిక, బ్రాని యకృత్యంబు లెన్ని♦పొనరించితి న
ట్లూనిన దౌర్భాగ్యంబున, ధ్యానింప రమాధిపతి ప♦దద్వయ మెడఁదన్.

ఆ॥ అనుభవించుచుంటి♦నద్దాన దుస్సహం, బైన గర్భదుఃఖ♦మగునె యింత
కన్న నెక్కు డనఁగ♦నన్నారకమ యేని, నేది తెరవు తనకిఁ♦కెవఁడు దిక్కు.

క॥ మేనే నే ననుకొని య, ద్దానిం గొని యాటలాడఁ♦దరలితిఁగా కె
ట్లేని హిత మాత్మ కొక్కెడ, నైన నొనర్పంగఁ జాల♦నైతి మదమునన్. ౨౨౯

ఆ॥ ఏయధీశు కరుణ♦సీతలమున్క లౌ, గర్భనిరయపీడఁ♦గడచువాఁడ
నతఁడె శరణ మని త♦దాశ్రయణమున దు, స్తరభవాబ్ధి నవల♦దాఁటువాఁడ.

ఆ॥ ఎఱుక గంటి నిట్టు♦లిదె మార్గ మేమఱ, మఱువ నింక మాజు♦మంజిమంబు
నీపదాబ్జయుగము♦నిరత మే సేవింతు, నెంతు నిన్న కావ♦వే రమేశ! ౨౩౧

తే॥ ఇట్టు లెంచుచుఁ బొరలుచు ♦ నెట్టకేల
కావరణంబున క్రిమిభంగి ♦ నచటు వాసి
మర్మయంత్రనిపీడ్యత ♦ మలసి యలసి
పుడమిపైఁ బడు పరవస ♦ మున మునింగి. ౨౩౨

చ॥ కడఁగి శిశుత్వముఖ్యగతి ♦ కల్పితకష్టము లెల్లఁ గాంచి చే
డ్పడి నవయౌవనంబు సొఱఁ ♦ బొఱ వనంబున గంధహస్తి చొ
ప్పడరఁ జరించు నీశ్వరుని ♦ యామహిమంబు స్మరింపఁబోవఁ డి
ట్వాడఁగున కిట్టి మేనిపయి ♦ వేడుకనే కద మూఁడు నిన్నియున్. ౨౩౩

ఆ॥ ఏను దెలుపనేల♦యివి యెల్ల యెల్లవా, రందు నవియ నీవు♦నరయకుండు
వెట్లు కాన నింత♦యెఱిఁగి దేహద్వయా, తీతు నిన్ను నీవు♦తెలిసికొనుము. ౨౩౪

చ॥ అనిశము నివ్విధిం బ్రకృతి ♦ కవ్వలివాని దశాత్రయాతిగున్
ఘనసుఖసచ్చిదాకృతి న ♦ ఖండు ననంతు స్వయంప్రకాశు శు
ద్ధుని ననిరుద్ధు శాంతు ధృతి ♦ తోఁ బరికించి స్మరించి యాత్మభా
వన వెలయించువాఁడె బుధ ♦ వందితుఁ డెందు విహంగమోత్తమా! ౨౩౫

ఆ॥ ఆచిదాత్మరూప♦మందిన మోహ మ, జ్ఞానసంభవంబు♦సడల నైన
నుండు నూడుఁగాక♦యొడ లొకింతయుఁ జింత, లేదు తత్త్వ మిదియ♦లే కుమార!

తే॥ యోగి సుఖ మంచు దుఃఖ మ ♦ య్యో యటంచుఁ
దలఁపఁగాఁ బోవఁ డిట్టు లీ ♦ దారి మఱచి
నిచ్చ లాత్మానుసంధాన ♦ నిరతి నుండు
దేహ మేదశపా లైన ♦ దిట్ట యగుచు. ౨౩౭

క॥ ప్రారబ్ధ ముండువఱకె శ, రీరం బని దాని దైన♦రీతి నరసి చి
త్సర మొనసి కృతకంచుక, ధారణ మగు సర్ప మట్లు♦తవులక నిలుమీ! ౨౩౮

చ॥ తెలిపెద నొక్క మేలి గతిఁ ♦ ద్రేత యనం దగు నాయుగంబునం
దిల జనియించు నచ్యుతుఁ డ ♦ ధీశుఁడు రాముఁ డనంగ రావణున్
బలిగొనఁ దండ్రి యానతిని ♦ బద్ధుఁడ కా నయి దండకాటవిన్
జెలువయుఁ దమ్ముఁడుం గొలువఁ ♦ జేరి వసించు వశు ల్నుతింపఁగన్. ౨౩౯

క॥ పంచవటి యాశ్రమమునఁ బ్ర ♦ పంచావనచతురు డుండఁ♦బౌలస్త్యుఁడు తా
వంచించి హరించు స మ,భ్యంచితఁ దత్సతిని వార♦లడవికిఁ జనఁగన్. ౨౪౦

తే॥ వనికలో నుంచు రామ లా ♦ వణ్యసీమ
నామె తద్భోజ్య మొల్లక ♦ రామ రామ
యనుచుఁ గృశియింపఁ దద్భక్తి ♦ నమరనాథుఁ
డమృతమయ మన్న మారసి ♦ యబల కొసఁగు. ౨౪౧

క॥ అందును సగపా లొక్కఁడ, ముందుగ విభుని దని యునిచి♦ముదిత భుజించున్
జెంద దపాయం బెద్దియుఁ, గ్రిందునఁ బడకుండుఁ దత్ప్ర♦కారము కలిమిన్.

ఆ॥ దొంగ యగుచు వాఁడు♦ దొఱకొన్న తెఱఁ గెంచి
దొరయుఁ గ్రోఁతిపిండు ♦ దొర యనంగ
నైన రవిజుతోడ ♦ నైకమత్యంబునఁ
బరఁగి యతఁడు కూర్చుఁ ♦ బరిజనముల ౨౪౩

క॥ వానరులఁ బనుప వారును, నానాదేశముల జనక ♦ నందిని వరయం
గా నెఱయ నందుఁ గొందఱు, నీ నెల వెనయంగఁ గలరు ♦ నెఱి కదె తఱిగాన్.

ఉ॥ వారికి నీకుఁ బొత్తొదవు వారిధిసన్నిధి ♦ నొంట నమ్మహా
దారులఁ జేరఁ జేరి వసు ♦ ధాసుతవార్త యథార్థమైన వా
గ్ధోరణిఁ దెల్పు మాకృతికిఁ ♦ దోనె ఫల మ్మయి పక్షయుగ్మ మొ
ప్పారును నూతనోన్మిషిత ♦ మందుచుఁ గ్రొందళుకు ల్దలిర్పఁగన్. ౨౪౫

ఆ॥ అనుచు మాని తెలిపె ♦ నానాఁటి కీనాఁటి, కొదవె నాకుఁ దత్ఫ ♦ లోదయంబు
గంటిరే శుభంబె ♦ కలుగు మీ కింకిటఁ, గంటిరే దొకింత ♦ కడమకృతిని. ౨౪౬

క॥ ఇప్పటికి వాక్సహాయం, బిప్పగిది ఘటించుమాత్ర ♦ కే నైతినిఁ గా
కెప్పాటనేనిఁ బొటుప, మప్పాపాత్ము జెస నెఱప ♦ నలుకఁగ నయ్యేన్. ౨౪౭

క॥ ఏ నరిగెద మీ సెఱఁ గనఁ, గా నొకఁ డొనరింప నేమి ♦ కల దద్దేవిం
గానఁగలారు తలాకుల, ప్రూనిక నెడ బొట్టు పెట్టి ♦ పున్నెము వెలయన్. ౨౪౮

క॥ ఈసంద్రము దుర్లంఘం, బేసరణి న్దాఁటువార ♦ మిది గడవకె యా
నా సామి కర్జ మరసెడు, నాసంపద యనెడు చింత ♦ నందకుఁ డింకన్. ౨౪౯

తే॥ ఎవని నామము స్మరియించి ♦ యీఁదరాని
యాభవాంబుధి లంఘించి ♦ యలసు లేని
సత్పదముఁ గాంతు రద్దేవు ♦ సంశ్రయించి
నారు మీ కెంత యీయకూ ♦ పార మనఁగ. ౨౫౦

క॥ జతన మొనరింపుఁ డిఁక మీ, జత నజితుం డాతఁ డుండి ♦ జయ మిడు నని య
య్యతిలోకవీక్షణము ఖగ, మతిలోహితపక్షహారి ♦ యై చనె గౌరీ! ౨౫౧

తే॥ మేను లవ్వారి కానంద ♦ మేదురముల, కాఁగ నొం డెద్దియును మదిఁ ♦ గాంక్ష సేయ
రాయమ యుదంత మేర్పడ ♦ న్నల్లుగాక, యున్న నెగయరె పక్షితో ♦ నుర్వి విడచి,

క॥ క్షణ మట్టులు పరవశతా, క్షణలక్షణపరత నుండి ♦ సంద్రముపై నీ
క్షణము నెలకొలిపి రట ర , క్షణముం బొనరింప నెవనిఁ ♦ గాంక్షించిరొకో.

— ♦ సముద్ర ప్రకృతి ♦ —

సీ॥ స్వకుటుంబినులతోడి ♦ సల్లాపమున యింపు, జలపక్షిరుతముల ♦ కలిమి నొడువ
నురువులు గట్టు తె ♦ న్నున్నఁ దరఁగల వీఁక, యట్టహాసమ్ము న ♦ యమ్ము నూపఁ
బర్వతంబుల కెగఁ ♦ బ్రాఁకి జాఱు జలౌఘ, మాటలాడెడు నెఱ ♦ సీ టనంగఁ
వ్యాత్తాస్యములు సుమ ♦ హాకాయములునగు, సత్త్వము లైన్నన్య ప్ర ♦ సక్తిఁ దెలుప

దానవులు ఫణధరులు పా ♦ తాళవాసు
లెడనెడఁ బ్రభావ మతిమాత్ర ♦ మెఱుక సేయ
రోమహర్షకరత్వని ♦ రూఢిఁ దనరు
నమ్మహాబ్ధి తెఱంగు వా ♦ రరసి రబల ! ౨౫౪

తే॥ ఒక దెసఁ బ్రబోధపూర్ణత్వ ♦ మొంది యొంట
నుదితనిద్రానుముద్రాప్ర ♦ యుక్తిఁ గాంచి
యాసముద్రంబు లోఁతు పాఁ ♦ తరయనీని
యదియ యనుమాటఁ దలఁపించె ♦ నపుడు పడఁతి ! ౨౫౫

తే॥ ఆకసం బట్లు దుష్పార ♦ మైన దాని
దానిఁ గని వానరౌఘంబు ♦ తల్లడిల్లె
నేమిసేయుదు మిది దాఁట ♦ కేటిమాట
యాత్రికూటంబు దరిఁ జేరు ♦ టని పురంధ్రి! ౨౫౬

—♦ సముద్రము దాఁటలేమికి వగచు కపుల కంగదుఁడు బలము పురికొలుపుట. ♦—

క॥ వారి విషాదం బారసి, సారమతి కుమారవిభుఁడు♦చయ్యనఁ బలికెన్
మీ రిటు లాడెదువారే, నేరనిజను లట్లు కార్య♦నిరతియు వలదే. ౨౫౭

క॥ ఇది తఱిమె చింత నొందఁగ, విదితాత్ముల పారయశులు♦విద్వట్ఛతముల్
మది లెక్కింపరు నేర్తురు, పదరిన జము నైనఁ జేతఁ♦బట్టి విడువఁగన్. ౨౫౮

ఆ॥ ఎంతవారినేని♦నిట్టట్టుగాఁ జేయు, నది విషాద మనఁగ♦నది మనమున
నిడుదురే విషాహి♦నొడిని బాలకు లట్లు, మిమ్ముఁబోంట్లుఁదొడరు♦మేల్మిఁ దక్క. ౨౫౯

క॥ విక్రమమున కిది తఱి గా, కక్రమున గతికిఁ గా ద♦హంపూర్విక సిం
ధ్వాక్రమణముఁ దలపెట్టి త్రి, విక్రమలీలాప్రసక్తి♦వెలయుఁడు జగతిన్. ౨౬౦

క॥ ఆలోచించుకొనుఁడు మీ, రీలో నని నాఁటిరాత్రి♦యెడయ సుజనతా
శ్రీలోలుఁ డతఁడు వేఁకువ, నాలలి మంతన మొనర్చె♦నందఱితోడన్. ౨౬౧

క॥ ఆహారిసేన కడలితో, నోహారిసాహరి బెనఁగ♦నోపి మెఱసె న
ష్టాహారిరాజసుతునిచే, నాహారిచే దేవసేన♦యట్లు ప్రియసఖి! ౨౬౨

ఆ॥ వాయుపుత్త్రుఁ డొకఁడు♦వాసవపౌత్త్రుండు, నొండు దక్క నన్య♦లోఁపఁగలరె
వలను మీఱి యున్న♦వానరవాహిని, దాని నిలుప నేనిఁ♦దఱుమ నేని. ౨౬౩

సీ॥ హరివృద్ధులం గని♦యాడెద నిట్లంగదుం, డనుమాన మెడలి మీ♦రవధరింపుఁ
డేమాన్య మతిసార♦మే సంశ్రయించి నేఁ, డీయంబునిధిపార♦మెనయఁగలమొ
యాయరిందముఁ డైన♦యర్కాత్మజు నెవండు, సత్యసంధునిఁ జేయఁ♦జాలువాఁడొ
యెవ్వాఁడు మనవారి♦నిందఱఁ దాఁ దేర్చి, యాలుబిడ్డలఁ గూర్తు♦ననెడివాఁడొ

యమ్మహామహుఁ డద్దేవ ♦ తాత్ముఁ డనఘుఁ
డీతఁ డని తెల్పుఁ డాప్రాణ ♦ దాత తాత
నా కభయ మిచ్చుఁగాత మ ♦ న్నాథుఁ డగును
గాత మేఁ గొల్తుఁ గొని కల ♦ కాల మతని. ౨౬౪

ఆ॥ రామలక్ష్మణులను ♦ రాణమైఁ గని మ్రొక్కఁ
దపనతనయుఁ జేరి ♦ తవిలి కొలువ
మమ్ముఁ గూర్చు లోక ♦ మాన్యుఁ డాఘనుఁ డేనె
యని ప్రసాద వృష్టి ♦ నినుచుఁగాత. ౨౬౫

—♦ కపులు సముద్రము దాఁటుటయందుఁ దమతమ శక్తుల వివరించుట. ♦—

క॥ అని యతఁడు వేఁడ నెవ్వా, రును నిద మిత్థ మని గతిని♦రూపణమున కో
పని తెఱఁగునఁ గాన్పింపం, గని వెండియుఁ బలికె నతఁడు♦కలవర మెడలన్.

మ॥ బలవంతు ల్దృఢవిక్రము ల్వ్యవహృత ♦ ప్రావీణ్యు లప్రాకృతుల్
కులసంపన్నులు ఖ్యాతు లర్చితులు సం ♦ కోచింతురే మిమ్ముఁబోం
ట్లలఁతిం బోవుదురే కృతిం బెరసినా ♦ రా నాచుఁ దోఁతెంచినా
రిల సత్కీర్తిని మించ నొండు గలదే ♦ యేనాఁటఁ జింతించినన్. ౨౬౬

క॥ వివరింపుఁడు మీమీశ, క్తివిశేషంబులఁ గడంగి ♦ కృతికిం దగు చొ
ప్పవలోకించెద మటుగా, క వితా తెఱఁ బుచ్చ నింకఁ♦గార్యము సెడదే. ౨౬౭

వ॥ అని విస్పష్టంబుగాఁ బలికిన నయ్యువరాజమణి పలుకుఁబడి విని గజుండును గవాక్షుండును గవయుండును శరభుండును గంధమాదనుండును మైందుండును ద్వివిదుండును సుషేణుండును నను నియ్యోనమంద్రి యోధులును బది మొదలు సేసి కొని యొక్కొకండు పది పది యెక్కుడుగా నగు నవ్వరుస నెనుబది యోజనంబులవఱకు నెగసి దుముక నేర్చువార మని స్వసామర్థ్యంబుల తెఱంగు వివరించిన నవ్వారి యాలాపనంబు లాలకించి కులవృద్ధుం డగు జాంబవంతుం డిట్లనియె.

ఆ॥ కలవు మున్ను గొన్ని ♦ గతిపరాక్రమశక్తు
లిపుడు వయసు పార ♦ మెనసియుంట

నంతయును బొనర్తు ♦ మనఁ బోల దిట్లని
స్వామికృతి నుపేక్ష ♦ సలుపరాదు. ౨౭౦

క॥ అతిలంఘించెద నేను న, వతియోజనదూర మంత♦వట్టు జవమ్మున్
మతి నూహించెద దీనం, గృతి తీర్పొనరించు వలను♦ కేవల మగునే. ౨౭౧

చ॥ తొల్లి త్రివిక్రమాకృతిని ♦ దోఁచిన యన్నెఱి వెన్ను నంజ కే
నుల్లసనం బెదం బెరుగ ♦ నోపి ప్రదక్షిణ మైకవింశతిన్
బల్లిదుఁ డీతఁడే యనఁగఁ ♦ బన్నితి నాఁటి సురాసురాళి మే
నొల్లని యంత సేసి దొర ♦ యొప్పదు పీవనఁ గా మెలంగితిన్. ౨౭౨

క॥ ఓషధులు తెచ్చి పరమం, బౌషధ మొనరించి యిడఁగ♦నమరులు నాని
ర్దోషతకు నలరి మహాత్మా, స్తోషం బాయువు నొసంగి♦మెచ్చిరి వత్సా!౨౭౩

ఆ॥ కాన నేఁటి తెలివి♦గని పల్కనయ్యె నా, నయ్యుదారు వాక్కు♦ననుమతించి
యంగదుండు నాకు♦నౌ నబ్ధి గడువంగ, మలయదేమొ శక్తి♦మగుడునపుడు.

క॥ అనుమానించెద నన ని, ట్లనె ఋక్షవిభుండు నీకు♦నగునే యొంటన్
జన నొడ్డ ననుచుఁగాకే, నని విభుఁ డనుపదముఁ ద్రోవ♦నరిగెడువాఁడే. ౨౭౫

క॥ రక్షింపనతగు భృత్యుల, కక్షీణబలుండు నైన♦నధిపు నతఁడుఁ దా
దక్షత వారి మనుచు నిది, లక్షణ మయ్యుభయమున కి♦ల న్మహితాత్మా! ౨౭౬

ఆ॥ మూలా మున్న చెట్టు♦మొగకొనుఁ బుష్పింప, ఫలము లిడఁగఁ గాన♦బాగుపడఁగ
నైన వారి కెపుడు♦నవు దాని కాచికో, లిదియ కాదె నీతి♦యిత్థచరిత! ౨౭౭

క॥ గురుసుతుఁడ వగుట నీవును, గురుఁడవ మా కిందఱకును♦గూడునె నీదౌ
పరిరక్షణముం జూడకె, యరిగెద నన ననుమతింప♦ననవద్యగుణా! ౨౭౮

ఆ॥ తలఁచితేని నీవు♦దాఁటఁజాలుదు విది, యొకఁ డనంగ నేల♦యుదధు లెన్ని
యైన నైన నిన్నె♦యనిచి రిత్తకరిత్త, యరుగువార మయ్య♦యనద లట్లు.

—♦ జాంబవంతుఁ డంగదుని వారించి యవల హనుమానుని బ్రేరేచుట. ♦—

తే॥ అనిన నంగదుఁ డిట్లను ♦ నార్య! యెదియు
వెరవుగా దన్నఁ బ్రియోప ♦ వేళ యొకఁడు
దక్క ది క్కొండు గలదె యి ♦ త్తఱి నధీశుఁ
గాంచి తలయెత్తి మే మైన ♦ గతి వొనఁగున. ౨౮౦

క॥ అని పలికినఁ గపినాథున, కనుపమహర్షంబు వొదల♦నతఁ డిట్లనెఁ ద్రి
క్కొనినయది కలదె కర్జం, బనవద్యముగా ఘటింప♦నగు ఘనుఁ డుండన్. ౨౮౧

క॥ అనుమానింపం జన దని, హనుమానునిఁ జేర నరిగి ♦ యన్నా! యి ట్లే
మని మిన్నకున్నవాఁడవు, తనవారిని మనుచు తఱియుఁ ♦ దలఁపఁగవలదే. ౨౮౨

తే॥ చూడమా యెన్నిమార్లేని ♦ సురుచిరాంగ!
నీదు బీరమ్ము గరుఁడు న ♦ న్నియతసార
మతఁడు నీవునుఁ బుట్టిన ♦ యంతనుండి
జగముఁ బొగడింపఁ గూర్చు ప్ర ♦ స్తారములను. ౨౮౩

క॥ పెనుబాములు బాములఁ బా, ల్గొనఁ గొనదలఁ ద్రొక్కి యెత్తి ♦ కొని చను నతఁడ
వ్వినువీధికిఁ దొలిపండని, యినుఁ గబళింపంగఁ బట్టి ♦ తీవ్ర కడంకన్. ౨౮౪

ఆ॥ పిన్ననాఁటిపనుల ♦ పెను పట్టు లుండ ని, ప్రేమితొఱఁత జగము ♦ లెల్ల మనుపఁ
గాదె నీవు భవము ♦ గనుట మాయంజన, నోము వొగడ నేర్చు ♦ నోరుఁ గలదె.

తే॥ సంతతికి నయి భర్తృ ప్ర ♦ శంస వడసి
యామె వ్రతనిష్ఠ మొనసి ని ♦ న్నందఁగాంచె
శివు ప్రసాదంబు తనయందుఁ ♦ జేరఁ జేర్చి
వాయుదేవుం డిడిన వర ♦ వైభవమున. ౨౮౬

క॥ తనయంతవానిఁ జేసెం, దనయుఁడ వని నిన్నతండు ♦ తద్దయుఁ దేజం
బున జవసత్త్వపరాక్రమ, ఘనబలసారముల వీఁడ ♦ ఖండుం డనుచున్.

ఆ॥ ఎల్లిదంబె నీవు ♦ తొల్లింటి పుట్టున, నేకపాదరుద్రుఁ ♦ డితఁ డనంగ
బరఁగినాఁడ వన్న ♦ పలుకు నిన్నోబలిన, వారం లంచుఁ గలరె ♦ వసుధలోన.

ఉ॥ సూర్యుని మ్రింగ నోట నిడఁ ♦ జూచి తటాలున వైచె వజ్ర మా
దార్యము వాయ సన్నగపి ♦ దారి కడుం బెడదారి నై యని
ధైర్యతదీయశక్తియు వి ♦ తా యన నయ్యె హనుప్రసక్తిఁ ద
ద్వీర్య మడంగె నన్న నుడి ♦ విశ్రుత మై జగ మెల్లఁ బ్రాకఁగన్. ౨౮౯

క॥ హనుమంతుఁ డనిరి నిన్న, య్యనువున నొక్కింత సోలి ♦ యద్రి నొఱఁగుచో
ననిలుఁడు గొని తద్గుహ నిడి, వినిపాతము గూర్చె నెల్ల ♦ విశ్వంబునకున్.

ఆ॥ ఒడలు వైవ నయ్యె ♦ నూపిరివుచ్చుకో, రాక యెల్లరకును ♦ రహి పొసంగ
నజహరాదు లప్డు ♦ డరుదెంచి యస్త్రశ, స్త్రముల కలవిగాని ♦ శక్తి నొసఁగి.

క॥ అజరామరుఁ డితఁ డని ని, న్నుఁ జిరాయురుపేతుఁ జేసి ♦ నూల్కొలిపి చనన్
బ్రజలకు మేలొనరించెను, బ్రజేశ్వరుని యాన నాప్ర ♦ భంజనుఁ డెలమిన్.

ఆ॥ కానఁ దావ కీన ♦ గతి విక్రమము లన, న్యాదృశంబు లనఁగ ♦ నయ్యె నింక
లెమ్ము తండ్రి! యొద్దు♦ లేర యిక్కర్జంబుఁ, జక్కపఱుప నెఱప ♦ సత్తి నెఱప.

సీ॥ ఉత్సహింపుము తెఱం♦గొప్ప నిరూపింపు, మభయ మి మ్మే నుంటి♦నంత కనుచు
రామకార్యధురంధ♦రత్వయశోవల్లి, నల్లు మయ్యఖిలది♦శావకాశ
మాత్రివిక్రముఁ బోల♦నై చూపుమా రూపు, గనులపండువుగాఁగఁ♦గాంచవలయు
నీమీఁదఁ జూడ్కుల♦నెలకొల్పుచున్నారు, నీవార లిందఱు♦నీదు నుడికి

జా గొనర్పుము మయ్య! ప్ర ♦ స్థానమంగ
ళాచరణయుక్తి కీసూక్తి ♦ యాఁ గదయ్య!
పెనువు గనుమయ్య నీదుగాం ♦ భీర్యమునకు
నంబుధియుఁ గింబుధియుఁ దూఁగ ♦ నగు నటయ్య. ౨౯౪

శా॥ నీతే జగ్గియు లంక గప్పురము నై ♦ నీరాజనం ద్వజ్జయ
శ్రీతృప్తి స్ఘటియించుఁగాఁతఁ బ్రిథితి ♦ శ్రీ నివ్వరింపంగ సా
కేతాభిఖ్యపురీవతంసమునఁ గి ♦ ష్కింధం బురంధ్రిజనా
నీతమ్ము ల్సుమము ల్కటాక్షతతులు ♦ స్నిగ్ధైఁ బడుంగావుతన్. ౨౯౫

—♦ హనుమంతుని మహోత్సవ ప్రశంస. ♦—

ఆ॥ అనిన యంతఁ దేజ ♦ మభివృద్ధి పడె మేను
వొంగె గుణసమృద్ధి ♦ వొసఁగె బుద్ధి
వికసనంబు వింత ♦ వెరవునఁ జూపట్టె
హనుమనికి మునిస్తు ♦ తానుభావ! ౨౯౬

తే॥ ఆవిజృంభణము న్గని ♦ యులరి రంద
ఱమ్మహాత్ముని వినుతించి ♦ రనువుపడియెఁ
గర్జ మని గర్జ లెనయింపఁ ♦ గడఁగి రొకట
దృక్స్రజమ్ముల పూజలఁ ♦ దేర్చి రార్య! ౨౯౭

ఆ॥ ఎట్టు లెటులు వార ♦ లెనయించిరి ప్రశంస
లట్టు లటులె మెఱసె ♦ నతని రూపు
పొగయు లేక యెల్లఁ ♦ బొదువు పావక మిదె
యాక్రమించు సంద్రి ♦ మనఁగ నపుడు. ౨౯౮

క॥ గగ్గురుపా టొదవఁగ నా, పెగ్గడ హరివృద్ధులకు న ♦ భీష్టుతినతు ల
ష్టగ్గలముగఁ బొనరింపుచు, దిగ్గన నిలువఁబడి పలికెఁ ♦ దేజోమూర్తీ! ౨౯౯

ఆ॥ పర్వతాగ్రములను ♦ బరవుల్లు సేయుచు
నగ్గి నెఱపి దెసల ♦ నంటఁ దాఁకు
మారుతునకు నోదు ♦ నౌరసపుత్రుండ
జవము గొన నొకింత ♦ సంతకరు వె. ౩౦౦

క॥ సారరయత వేమాఱులు, మేరువుఁ జుట్టి తిరుగుదునొ ♦ మేకొను ధృతిఁ గా
సార మని యబ్ధిజలమును, బారిప్లవ మొప్ప జగము ♦ పైఁ జల్లుదునో. ౩౦౧

ఆ॥ పండె మొకఁడు చఱచి ♦ పక్షీంద్రుశేఁ జని
చక్రవాళగిరిఁ బ్రి ♦ సక్తిఁ దిరిగి
వత్తునో దివసము ♦ వలసవో ప్రొద్దుశోఁ
బోయి మున్నె వచ్చి ♦ పొడుతునొక్కొ. ౩౦౨

క॥ ఇంతలు సేయుచుఁ బుడమి నొ, కింతయు స్పృశియింప భార ♦ మే యనఁజుం డే
వింతగఁ బలుకుట గా దిది, యంతయుఁ దథ్యంబ యై బ ♦ యల్పడు నింకన్.

క॥ మున్నీరు వట్టిపోయెడు, నన్నియతికిఁ బుడమి వగుల ♦ నడువఁగ గిరులన్. ౩౦౩
సున్నియిడ దూదిపింజెల, సన్న మొగిళ్ళు లూఁది పఱపఁ ♦ జాల్కొందు నిటన్.

క॥ మీమానసములు భాసిల, నామీఁద నె కన్ను లునిచి ♦ నారాకఁ గనం
గా మాటలాడవలసెను, రామేశ్వరకార్యపూర్వ ♦ రంగం బనుచున్. ౩౦౪

ఆ॥ కులముత్రోడి దైత్యుఁ ♦ గూల్చి లంకయుఁ గాల్చి
దేవిఁ దెచ్చి రామ ♦ దేవుఁ గూర్తు
నో త్రిసూట మెత్తి ♦ నొవ్వ కవ్వానితో
నిడుదునో మహీంద్రు ♦ నెదుట నిపుడు. ౩౦౬

తే॥ నామనోబుద్ధ్యహంవృత్తి ♦ నటన లిప్పు
డమ్మహాభాగఁ గనినట్టు ♦ లన్నరాదు
నన్నయంతలు సేయంగ ♦ నైనయట్టు
లున్నయవి దెల్పుఁ డియ్యది ♦ యుక్త మనుచు. ౩౦౭

ఆ॥ వజ్రహస్తుఁ డైన ♦ వనజోద్భవుం డైన, నన్యుఁ డైన నెదుర ♦ నయ్యె నేని
నడిచికొందుఁ జేత ♦ నమృతపాత్రిక యున్న, నీడ నొక్కమాత్ర ♦ వేఁడఁదలఁప.

—♦ జాంబవంతుఁడు హనుమత్ప్రభావము విని కర్తవ్యముఁ దెలుపుట ♦—

క॥ అని యున్నది యున్నట్టులె, యను నాతనిఁ గాంచి భల్లు ♦ కాధిపుఁ డనఘా !
యనినంతకన్న మిన్నగఁ, బొనరింతువ కాక యొకటి♦ పొల్లని కలదే. ౩౦౯

క॥ కల్యాణరుచులు నీయవి, కల్యము శోభనము గాఁగఁ ♦ గదిసెదుఁ గపులన్
శల్య మెడలఁ జేయుచునె య, హల్యావరదుని ప్రసాద ♦ మన నై వత్సా !

ఆ॥ అమ్మహాత్ము పత్ని ♦ నారసి యాయమ, తెలుపువార్త లెల్లఁ ♦ దేటపడఁగ
విభున కెఱుక సేసి ♦ విడియింత మామీఁద, వలను గాంచి సైన్య ♦ వర్గములను.

క॥ శ్రీరాము సేన యిది యనఁ, గా రామునిఁ గొలిచి యతఁడు♦గా రాముని మీ
రీగాణ నడువుఁ డని రాఁ, గా రావణు మనికి నఱుముఁ♦గా నగు మనకున్. ౩౧౨

క॥ ఆతని ప్రతిష్ఠయందలి, ఘాఁ తొం డరయనిద కాఁగఁ ♦ బరఁగించుట మే
లేతటినేనియు మన కదె, ఖ్యాతికిఁ గారణము నిత్య ♦ కల్యాణగుణా ! ౩౧౩

ఉ॥ ఎల్లశుభంబు లీవు గొను ♦ మేలిక యుల్లము పల్లవింపఁగాఁ
జల్లని వార్తఁ దెల్పి మను ♦ సంతతిఁ దేర్పఁగఁ జాలె సీతఁ డా
నల్లవొ యంచు లోకు లభి ♦ నందనముం బొనరింపఁ బొల్చి మా
తల్లడపా టెడల్చి యిల ♦ తా నిల నొనటు నిల్చి యేయెడన్. ౩౧౪

క॥ కన్నులు నీదెన నుండును, గన్నా కగు నీదురాకఁ ♦ గాంక్షించుచు మే
మిన్నేల నొంటి పాదము, న న్నిల్తుము త్వజ్జవమ్ము న ♦ న్నెఱిఁ గాంచన్.

క॥ దేవతలు నీకు విజయం. బేవేళఁ బొసంగఁ జేయ ♦ నెంచఁగ ద్యుమణి
శ్రీవెలయ నుదయ మెనయుము, మా వారని పున్నెములను♦మారుతతనయా !

—♦ హనుమంతుఁడు మహేంద్రాద్రిపై నెక్కి సముద్రముదాఁట నుంకించుట ♦—

ఆ॥ అనిన సంతసించి ♦ యంతకు నంతలై, మిన్ను ముట్టి యతఁడు ♦ పన్నె దృష్టు
లపుడె జలధిపైని ♦ నాలంక యాలంక, యనుచు లంక పైని ♦ నంబుజాక్షి.

సీ॥ మెఱుఁగుఁదీగెల గుంపు ♦ మేకొనెనొ యనఁ, దన మేనికాంతులు దెస ♦ లాని నిగుడ
నట భైరవకరంబు♦నం బొల్చు పరిఘంబు, పగటునఁ దోఁక యు♦ప్పరము దోఁకఁ
బొడుపుగుబ్బలిపైనె ♦ గడు రవిమండలి, యనుకారమున వద ♦ నాబ్జ మొప్ప
మంథానగిరిఁ జుట్టి♦మసలయించు వాసుకి, తలతోఁక లై బాహు♦వులు వొసంగఁ

దనదు లంఘనమున ♦ దాఁడి సర్వంసహా
తా సహింపఁ దనెడు ♦ తలఁపుఁ గదుర

నెక్కెఁ బవనజుఁడు మ ♦ హేంద్రాద్రి శిఖరోరు
కూట మొంట నిదియ ♦ కూడు ననుచు. ౩౧౮

క॥ తడబడి జవజవలాడుచు, బుడమి వడఁక వంచి యెత్తఁ బూనిరి తల ల
య్యెడ వాఁ డడుగిడి యెత్తఁగ, నడుగునఁ బడియున్న బడుగు ♦ లంచితకరుణా!

క॥ స్తోత్రము లధికము లయ్యెను, బాత్ర మెఱిఁగి సంతసంబు ♦ పరవడి సేసెఁ
వే త్రిపథఁ గూడఁగఁ దమ, యాత్ర మెడలి రపుడు కపుల ♦ హార్పతితేజా!

ఆ॥ మంగళాంగి! వారు ♦ మాలిమి మేలిమి, గాంచఁ గనిరి వానిఁ ♦ గనకవస్తు
నమ్మహేంద్రధరము ♦ నధివసించిన మేరు, శిఖరి యయ్యె వీఁడు ♦ సిరి నటంచు.

ఆ॥ తోరణ ల్ఘటించి ♦ తొంగలిచూడ్కుల
విరులు చల్లి నుతులు ♦ వెలయఁ జేసి
భాగ్య మొదవె ననుచుఁ♦బరఁగ నీరాజనల్
గూర్చి రమరసతులు ♦ కువలయాక్షి! ౩౨౧

క॥ మంగళము శుభాంగికిజయ, మంగళ మగు మాకు రామ♦మహిజానికి నీ
మంగళమూర్తి ప్రయాణము, మాంగళికమె యనిరి సురలు♦మహిలామణిరో!

ఆ॥ అనుచుఁ దెలుప శోభ ♦ నాంగి యద్రిజ విభు
మేలు మే లటంచు ♦ మెచ్చి పొగడె
నవయవములఁ బులక ♦ లమర నందమ్మొ నా
నందమును బొనర్చె ♦ ననుచు తృప్తి. ౩౨౪

క॥ మవ్వము దను పారఁగ నా, కివ్వలకథ వినుచు మనుచు♦నాసతి పతిపై
నివ్వటిలఁ జేసెఁ జూడ్కుల, నవ్వరదుం డామెఁ బొదిపి♦యక్కునఁ జేర్చెన్.

మ॥ చలితారణ్యచరోచితక్రమణసం ♦ స్త్యాయార్ధనాయాసయు
క్కలనాపేక్షిత గవ్యుతాంచితగుహా ♦ కల్యాణధామప్రభో
త్కలసందర్శనలాలనక్షమమహా ♦ తాత్పర్యపర్యస్తపు
ష్కలరస్యార్ధనివేదనాపగతితృ ♦ ష్ణాయోగతాపాదకా! ౩౨౬

క॥ నియమితజనోపదేశా, ప్రయోగసముపాత్తదేశ♦భరితానందో
చ్చయసాధకభావాంచ, త్స్వయంప్రభాఽముక్తముక్తి♦సంధానపరా! ౩౨౭

ప్రమితాక్షర.

అమితార్ణవోద్వ ♦ హన యాపనదృ
క్ప్రమితాక్షరార్థ ♦ పర భావలయాఽ
నమితావనాత్త నయ ♦ నద్ధనుహ్యా
ద్గమితాత్మసీన ♦ ఘనకామ్యకలా. 3౨౮

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
గిష్కింధాకాండంబున సర్వంబును దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శుద్ధాశుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 15 | దంబం | దంబంబు |
| 11 | 19 | దివి | దివె |
| 36 | 30 | డించె | డించి |
| 33 | 17 | చరిద్రి | చంద్రి |
| 51 | 17 | ద్తాత | ద్దాత |
| 75 | 9 | శ్రీతా | శ్రీతాదృతా |
| 80 | 9 | ముమున | మున |
| 80 | 29 | పుష్క | పుష్ప |
| 87 | 4 | మంకి | మకిం |
| 107 | 27 | రపు | రవు |
| 119 | 14 | తేఁ | తేఁడు |